

# చందోలు శాస్త్రిగారి అంతేవాసి

- మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రి

'చందోలు శాస్త్రి'గారు అన్న పేరు తరుచూ చాగంటి వారి ప్రవచనాలలో, గరిక పాటివారి ప్రసంగాలలో వినిపిస్తూంటుంది. కాని 'చందోలు శాస్త్రి' (తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రి) గారి గురించి సవివరంగా ఎవ్వరికీ తెలియదు.

చాలామంది తెలుసుకునే ప్రయత్నంకూడా చేయరు. 'చందోలు శాస్త్రి' గారింట్లో శారదాదేవి 'బాల'గా నడయాడుతుండేది. శాస్త్రిగారు అడపా దడపా శారదామాతయిన 'బాల'తో సంవాదాలు జరుపుతుండేవారనిమాత్రం ఈ ప్రసంగాలవలన శ్రోతలకు అర్థమయిఉండవచ్చు.

కాని 'చందోలు శాస్త్రి' గారు అంటే 'ఒక మహర్షి' అని చాలామందికి తెలియదు. వారి తండ్రిగారు కూడా ఒక మహర్షి.బాపట్ల- రేపల్లె మార్గంలో ఉండే చందోలు కుగ్రామంలో వారి నివాసం ఉండేది. ప్రస్తుతంకూడా అక్కడే ఉంది.

కొంతమంది బుద్ధిజీవులు, ఆధ్యాత్మిక సాధకులు ఈ చందోలు పుణ్యక్షేత్రం వెళ్ళి శాస్త్రిగారి ఇంటినీ, శారదామాత 'బాల'గా నడయాడిన ఆ పవిత్ర స్థలాన్ని సందర్శించి వస్తుంటారు.

అయినా వారందరికీ చందోలు శాస్త్రిగారిగురించి సవివరంగాతెలుసుకోవటానికి వీలులేదు.

ఈ కారణంగానే చందోలుమహర్షి గురించిన సమగ్ర జీవిత చరిత్ర ఎవరైనా గ్రంథస్థంచేశారా అనిశోధిస్తే వినపడే ఒకే ఒక్క పేరు మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ప్రస్తుతం 70 సంవత్సరాలుపైనే ఉంటాయి.

ధర్మపత్నీ సమేతంగా తెనాలిలో సేదతీరుతూ వీలున్నప్పుడల్లా అద్భుత సంస్కృత రచనలు చేస్తుంటారు.



శ్రీ గురు దంపతులు

## శాస్త్రిగారి రచనలు

ఈ మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు స్వయానా శ్రీ 'చందోలు శాస్త్రి'గారికి శిష్యుడు. అంతేగాదు.

చందోలు శాస్త్రిగారు తన సోదరుడి కుమార్తె అయిన అనసూయమ్మగారిని దత్తు తీసుకొని, తన శిష్యుడికి సంస్కృతాంధ్రాలలో విద్య గరిపి, వారికిచ్చి వివాహం జరిపించారు.

మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వివాహానంతరం ఉద్యోగార్థియై ఒంగోలులోని శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి సంస్కృత కళాశాలలో సంస్కృత అధ్యాపకుడిగా చేరి పిల్లలకు గురుకుల ప్రమాణస్థాయిలో సంస్కృతవిద్యను బోధించేవారు. దాదాపు 35 వసంతాలు వేర్వేరు సంస్కృత కళాశాలల్లోసంస్కృత విద్యగరిపిన ఈ మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రి గారు సుమారు 150 పైగా గ్రంథాలను రచించారు.

అందులో మొట్టమొదటి గ్రంథం 'శ్రీగురు చరిత'. సంస్కృతపద్యాలలో తన గురువుగారు చందోలు శాస్త్రి గారి ఆధ్యాత్మిక జీవితాన్ని గ్రంథస్థం చేశారు. ఇది ప్రప్రథమంగా 1991లో అచ్చయింది. పుస్తకం కవరుపేజీపై గురు దంపతుల చిత్రంతో అచ్చయిన ఈ పుస్తకం ఆసాంతం తెలుగు లిపిలోనే ఉంటుంది.

## గురువు అనుగ్రహం

తయోర్గుర్వోశ్చూడాకవితశరేఖ భరణయోః
నమో వాకదన్యత్కిమపి చరితుం నాస్మి
విపుణః

అని గురుదంపతుల చిత్రం కింద అత్యంత భక్తి, వినయ, నిరాడంబరతతో నిండిన పై పంక్తులను ఒక కుసుమంగా సమర్పిస్తారు మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రి గారు.

అంతేగాదు తాను రాసిన ఈ 'శ్రీ గురు చరిత'కావ్యశైలికి చందోలుశాస్త్రిగారు రాసిన 'దత్తాత్రేయాష్టక గర్భిత ఆత్మ సుప్రభాతము, మత్స్యేష్ణ'

అన్న చిరు కావ్యము ప్రేరణ అని ఆత్మ నివేదనములో చెప్పుకున్నారు. వారి మాటల్లో చందోలు శాస్త్రిగారు రాసిన ఈ ఆత్మ సుప్రభాత శ్లోకమే వారి కావ్యానికి జీవగర్ర!

"సావత్సరోరజిసి తత్స వితుర్వరేణ్యం
దేవస్యధీమహి మహామతి చోదకస్య,
గాయత్రమర్థమితి భావయతోదురంతా
సాంతానిశాం ప్రవిరలా మమ సుప్రభాతమ్"

దీని అర్థం తెలిస్తే మేళ్ళచెరువు గారికి శ్రీ గురుచరిత కావ్యంలోని అనేక ఆధ్యాత్మిక కిటుకులు అవలీలగా బోధపడతాయి.

అంతేగాదు. గట్టి లక్ష్మీ నరసింహశాస్త్రి గారు 'అగ్నిపరీక్ష' అనే ఒక చిరు నవలను రాశారు.

ఆ నవల చదవగానే మేళ్ళ చెరువు గారికి తానూ ఒక కావ్యం సంస్కృతంలో గురువుపై ఏల రాయకూడదనే సంకల్పం కలిగింది. అదే గురువు అనుగ్రహం కల్గిన మధురక్షణం.

శ్రీహర్షుడు రాసిన కావ్యాలకు ఏ విధంగా ఆయన గురువే సర్వస్వం అయినట్లు మేళ్ళచెరువు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కూడా అదే మార్గమును అనుసరించే సాహసం చేశారు.

## గొప్ప పండితులు

'మహతాం సంస్తవపద గౌరవాయ'ని జ్ఞప్తిచేసుకొంటూ, 'నానృషిః కురుతే కావ్యం, నా శివశ్శివమర్చయేత్' అని తన గురువు ఘనతను సార్థకం చేశారు మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

చివరగా 'చక్రాంకితాం భోజయుగం సృజంతి పాద ప్రభా సద్గురురాఘవస్య' అంటూ సువర్ణమంత్ర పుష్పాలు సమర్పించారు మేళ్ళచెరువుశాస్త్రిగారు.

అంతేగాదు క్రీ.శ. 2005లో 'పితాపుత్ర కవీశ్వరులు- చందోలు మహర్షులు' అనే చిరుజీవిత చరిత్రను సులభమైనరీతిలో తెలుగులో అచ్చువేశారు. దాదాపుగా 'చందోలుశాస్త్రి'గారి గురించి చాగంటివారు ప్రవచించే మాటల్లో కథలు, దానిలోని ఆధ్యాత్మిక అంశాలు,

శ్రీ గరికపాటి నరసింహరావు గారు ప్రసంగవశాత్తు ప్రశంసల వర్షం కురిపించే పదబంధాలు అన్నీ ఈ గ్రంథం నుంచి వచ్చేవే.

కాని కారణం ఏమైనా ఈ ప్రవచనకారులు మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రి గారు గ్రంథస్థం చేసిన 'శ్రీ గురుచరిత'నిగాని, 'పితాపుత్ర కవీశ్వరులు-చందోలు మహర్షులు'

## ఆధ్యాత్మిక గ్రంథాలు

పుస్తకాన్నిగాని తాము ఉటంకిస్తున్న సంఘటనలకు ప్రమాణంగా పేర్కొనరు.

ఈ కారణంగా మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రి గారు గొప్ప సంస్కృతాచార్యులు, పండితులు, విద్వాంసులైనప్పటికీ అజ్ఞాతంగానే ఉండిపోయారు. అంతేగాదు, వారు కూడా 'చందోలు శాస్త్రి' గారిలా అనేక గ్రంథాలు, అనువాదాలు చేశారు.

ఆధ్యాత్మికత, సాధన విషయంలో తేడా తప్ప చందోలు శాస్త్రిగారికి, మేళ్ళచెరువు సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి ఎన్నో పోలికలు కనిపిస్తాయి.

ఉదాహరణకు 'చందోలుశాస్త్రి' గారు స్వీయకవితలు, వచనంతో తెలుగులో చేసిన ఆధ్యాత్మిక ఉపదేశాలుగాక అనేక ప్రసిద్ధ గ్రంథాలను టీకా తాత్పర్యంతో వివరించారు.

ఇంతకుముందే పేర్కొన్నట్లు 'దత్తాత్రేయాష్టక గర్భిత ఆత్మ సుప్రభాతం 'చందోలుశాస్త్రి'గారి స్వీయ రచనల్లో ఒకటి. ఇది తెలుగు లిపిలో సంస్కృతంలో ఉంటుంది. ఇందులో అనేక ఆధ్యాత్మిక సాధన రహస్యాలు ఇమిడిఉన్నాయనే భావనతోనే దీన్ని ప్రామాణికంగా తీసుకొని శ్రీ గురుచరిత కావ్య రచనకు మేళ్ళచెరువు వారు ఉపక్రమించారని ఇందాక చెప్పుకున్నాంగదా!

శ్రీ దక్షిణామూర్తి స్తోత్రాన్ని కూడా 'చందోలు శాస్త్రి' గారు టీకా తాత్పర్యములతో వ్యాఖ్యానించారు. అలాగే 'శ్రీ, శంకర గ్రంథ రత్నావళి' (ఏకాదశ సంపుటము) స్తోత్రములు అనువదించారు. ఇవి ఒక వరుసలో వారు అనువదించారు.

ఈ గ్రంథాలలో అనేక ఆధ్యాత్మిక రహస్యాలు నిక్షిప్తం. మచ్చుకు 'శ్రీ లలితాత్రిశతి' పూర్వపీఠిక

మంచి 'శ్రీ లలితా త్రిశతీ' భాష్యం చదివితే తెలుస్తుంది దాని వైశిష్ట్యం ఏమిటో.

మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రి గారు కూడా దాదాపు గురువు గారి అడుగుజాడల్లోనే నడిచారని వారి రచనల పరంపర చూస్తే సులువుగా బోధపడుతుంది. ఒక రకంగా వాటిని పరిశీలించినా, చదివినా చందోలుశాస్త్రి గారే వారిలో ప్రవేశించి ఈ రచనలు చేయించారా అన్నంత ఆశ్చర్యంగా ఉంటుంది.

వీటన్నింటిలోనూ మేళ్ళచెరువువారి పాండితీ గరిమ స్పష్టంగా ద్యోతకమవుతుంది.

ఆధ్యాత్మిక గ్రంథాలు కొన్నింటిని వారు పొందుపరుస్తూ రచనలు సాగించారు.

కొన్నిచోట్ల వారే వివరణ ఇచ్చిన, కొన్నిచోట్ల ఏ వివరణా ఇవ్వకుండానే రచనలో సాగిపోయారు. మనస్సుపెట్టి చదివినవారికి ఈ తేడా స్పష్టంగానే అవగతమవుతుంది.


తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రి

## సంస్కృతకావ్యాలు

ఇందుకుగాను వారు తాను రచించిన తొలి కావ్యం 'శ్రీ గురుచరిత'లో గుంటూరు శేషేంద్ర శర్మ గారి 'షోడశి-రామాయణం-రహస్యములు' పొందుపరచిన 'స్వర్ణహంస' పుస్తకంలో గ్రంథులను విప్పటం ఎలానో తెలుసుకొని దీన్ని తన సాహిత్యంలో పొందుపరచటమే.

గుంటూరు శేషేంద్రశర్మ వచన కవిగా, రచయితగా తెలుగు నాట ప్రసిద్ధి. అయితే అందరికీ (ఏ కొద్దిమందికో మాత్రమే తెలిసిన రహస్యం) తెలియనిది ఏమిటంటే వారు సంస్కృతంలో దిట్ట.

ముఖ్యంగా 'స్వర్ణహంస'లో శ్రీహర్షుడి గురువు గారు ఆధ్యాత్మిక రహస్యాలను ఎలా గ్రంథుల రూపంలో నిక్షిప్తం చేశారో బయటి ప్రపంచానికి తెలియజెప్పి ఒక మహాకవి, జ్ఞాని. ఇది తెలియనివారు అనవసరంగా వారిని విమర్శిస్తుంటారు కూడా.

అది ఇక్కడ అప్రస్తుతం కాబట్టి దాన్ని ఇక్కడే వదిలేస్తున్నాను. అలాగే ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారు రచించిన 'భాగవత రహస్య ప్రకాశం' కూడా మేళ్ళచెరువు వారి సాహితీ వ్యవసాయాన్ని ఒక స్థాయినుంచి మరో స్థాయికి తీసుకెళ్ళింది.

ఈ కోవలో వారు సంస్కృతంలో రాసిన కావ్యాలను తొలుత వివరిస్తారు.

'శ్రీ గురుచరిత' (1991)తో ప్రారంభమైన వారి రచనా విన్యాసం- సాలభంజికా సూత్రధారం, లలితానందలహరి, స్పందలహరి, ప్రత్యాధారా స్తవం, వేదనాదస్తవః, అకర్మానందలహరి, చరణారవింద షోడశి, బందు మాలినీ స్తవః- వంటి కావ్యాలద్వారా ప్రాచుర్యంలోకి వచ్చాయి.

'శ్రీ గురుచరిత' కావ్యం చదివిన రాణి రామకృష్ణగారు (ప్రస్తుతం వీరిని తత్త్వవిదానంద స్వామిగా వ్యవహరిస్తున్నారు) ఎంతో పాండిత్యం, ఆధ్యాత్మికం సమ్మిళితం అయితేగాని ఇలాంటి గ్రంథాలు మామూలు సంస్కృత పండితులు రాయలేరు అని వ్యాఖ్యానించారు.

ఈ గ్రంథాల పేర్లు వింటేనే వీటిలో ఏదో కొత్త పద ప్రయోగాలున్నట్లు తెలుస్తుంది. చదివిన వారికి ఎంతో అద్భుత సంస్కృత ప్రయోగాలు,

విన్యాసాలు స్పష్టంగా ద్యోతకమవుతాయి.

అలాగే తెలుగులో కూడా వారి పాండితీ వ్యవసాయం నిరాఘాటంగా సాగింది.

సామిశరణం, మదాలసజోలపాట, ఆత్మ సుప్రభాతం, అస్తిదేవం (సదసత్సంశయం), కనకధారా స్తవము (పద్యానువాదం, వ్యాఖ్య), శ్రీకృష్ణరాసలీల- యోగత్రయీ హేల, బీజతంత్రం, అటుకులలో కిటుకులు (విమర్శనా వ్యాసం), గజేంద్ర మోక్షం- ఋషిరుణం, వామనుడు వమనము, మొదలైనవి వారి సంస్కృత సాహిత్య విన్యాసాలకు, ఆధ్యాత్మిక జ్ఞానలోతులకు మచ్చుతునకలు.

## తెలుగు వ్యాఖ్యానాలు

ఇవిగాక తెలుగు వ్యాఖ్యానాలు చాలా ఉన్నాయి. వరాహోపనిషత్తు, శివగీత, త్రిపుర మహిమ్నఃస్తోత్రం, విజ్ఞాన భైరవం వంటివి ఎంతో నిగూఢమైన సంజ్ఞా శాస్త్రం (Semiotics)తో నిండి ఉంటాయి.

వీరిలో ఈ లోతైన సాహితీ ఆధ్యాత్మిక పాండిత్యం వలననే అపర ఆదిశంకరుడు వరాహ అవతారంగా కీర్తిగాంచిన శ్రీ బెల్లంకొండ రామరాయ కవిగారు రాసిన పలుసంక్లిష్టమైన సంస్కృత గ్రంథాలను అనువదించగలిగారు.

అష్టక గుచ్ఛము, సిద్ధాంత సింధుః, రమా వల్లభ రాయ శతకం, అద్వైత విజయం, వేదాంకిత నిశ్చయం, అద్వైతామృతం, భాగవత చతుఃశ్లోకీ, శంకరా శంకరా భాష్య విమర్శనం, సంక్షేప శారీరకం, ఆంధ్ర వేదాంతముక్తావళీ మొదలైనవి వారి అనువాద పటిమకు, వ్యాఖ్యాన శక్తికి అద్దంపడతాయి.

శ్రీ బెల్లంకొండ రామరాయకవిగారు హయగ్రీవావతారం. ఆ మహనీయుడు తాను జీవించిన స్వల్పకాలంలోనే దాదాపు 141 గ్రంథాలు రచించారు. వేటికవే నభూతో న భవిష్యతి అన్నట్లుండే గ్రంథాలు. సంస్కృత లిపిలో ఉన్నవాటిని అర్థంచేసుకునే పరిజ్ఞానం లేకపోతే ఇది సాధ్యం కాదు.

'చందోలు శాస్త్రిగారి' అనుగ్రహమో, స్వీయ ఆత్మశక్తోగాని మేళ్ళచెరువు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఈ మిక్కిలి కష్టసాధ్యమైనదానిని సులువుగా సాధించారు. ఆ విధంగా ఆయన బెల్లంకొండ రామారావు గారి రచనల అనువాదాలద్వారా కూడా సార్థక కవులు, పండితులు, విద్వాంసులు.

ఇవిగాక 'విద్యారణ్యకృత వివరణ ప్రమేయ సంగ్రహా'నికి ఆంధ్రానువాదం చేశారు.

సాధారణంగానే విద్యారణ్యులవారి వివరణ ప్రమేయం జటిలంగా ఉంటుంది.

ఇది ఆ గ్రంథాన్ని అనువదించటానికి పూనుకున్నవారందరికీ అనుభవైకవేద్యము.

అలాంటి దాన్ని తెలుగులో అనువాదంచేయుటం ఎంతో సాహసంతో కూడిన పని. మేళ్ళచెరువువారు గనుక ఈ వ్యాయామం చేసి ఫలితాన్ని పాఠకులకి అందించారు. అలానే 'శ్రుతిగీతలు' అనే కావ్యంకూడా.మధ్యయుగంనాటి రచనలు- గ్రంథాల అనువాద సాహిత్యానికి మేళ్ళచెరువు వారి ఈ రచనలు అద్దంపడతాయి.

మన ప్రాచీన ఆధ్యాత్మికతనుంచే సాహిత్యం ఉద్భవించింది. హర్షుడికైనా, కాళిదాసుకైనా, శ్రీనాథుడికైనా, పోతనకైనా ఐతిహాసిక, వైదిక సాహిత్యం పఠన, విమర్శన నుంచే నూతన కావ్య సృజన సాధ్యమైంది. ఈ సంగతి మరిచి ఆధునిక సాహిత్యాన్ని పరి పుష్టం చేసేందుకు తెలుగు సంకర ఆంగ్ల సాహి త్యాన్ని ఆశ్రయిస్తున్నారు.

ఈ కారణంగా ప్రాచీన సాహిత్యాన్ని నేటి తరాలముందుంచేందుకు అహోరాత్రులు కృషి జరిపి ఎంతో సాహితీ సంపదను ప్రోదుచేసిన మహా కవులు, పండితుల్ని విస్మరిస్తున్నారు.

అలా విస్మరించకూడని మహాపండితుల్లో మేళ్ళ చెరువు సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ఒకరు. అటు 'చందోలు శాస్త్రి'గారి అంతేవాసిగా, ఇటు బెల్లంకొండ వారి సాహిత్యానికి ఏకైక వ్యాఖ్యాన అనువాద వారసునిగా, మధ్యయుగ సాహిత్య అనువాదాలకి ఒక ప్రతీకగా మనముందు నిలిచిన ఒక మహా పండితుడు మేళ్ళచెరువు.

వారి సాహితీ కృషి చిరస్మరణీయమైనది. పదిమంది గ్రహించి చదువగలిగినది.

డా॥ కొప్పరపు నారాయణమూర్తి